Rishte Ka Intekhab Kaise Karen?
(Telugu)

# వివాహ సంబంధాల ఎంపిక ఎలా చేయాలి?

ఉర్దూ మూలం
డా॥ ముహమ్మద్ ఫహీం అఖ్తర్ నద్వి

అనువాదం
అబ్బాదుల్లా

# విషయసూచిక

# తొలిపలుకులు

ప్రస్తుత మనసమాజం ఆధునిక సమాజం. ఈ సమాజం ఎన్నో సవాళ్ళను ఎదుర్కొంటుంది. అందులో కుటుంబ వ్యవస్థకు చెందిన సమస్యలు ఉన్నాయి. ఈ సమస్యలు ప్రత్యేక ప్రాముఖ్యత సంతరించుకొన్నాయి. ఒకవైపు శరవేగంతో పరుగిడు సమాజిక మార్పులు వచ్చాయి. కేవలం విధివిధానాల్లోనే మార్పులు రావడం కాకుండా ఆలోచనపరంగా, సిద్ధాంతాలపరంగా కూడా అనేక నూతన విధానాలు అమలులోకి వచ్చాయి. మరోవైపు మోడరన్ టెక్నాలజీ అలలు ఉవ్వెత్తున లేచివస్తున్నాయి. ఈ నూతన విషయాలు సమాజంలోని ప్రతి మానవుణ్ణి స్పందింపజేస్తూ బాహ్యంగా అంతర్గతంగా అతనిలో మార్పులు తెచ్చి పెట్టుతున్నాయి. ఇంకోవైపు మరో వర్గం స్వార్థం కోసం వ్యక్తిగత లాభాల కోసం యావత్తు జాతిని, సమాజాన్ని ఇంకా చెప్పాలంటే మానవాళినే బలిచేస్తూ స్వయంగా సంతృప్తి పొందకుండా ఉంది.

ఇదీ మన సమాజం పరిస్థితి. ఈ పరిస్థితుల్లో ఇస్లామీయ సమాజం గురించి ఆలోచిస్తే అది బలమైన ఆధ్యాత్మిక నైతిక సిద్ధాంతాలు కలిగి ఉంది. ఒక కుటుంబ నిర్మాణం ఎలా ఉన్నతంగా, ఆదర్శంగా జరుగాలో దాని ప్లాను, కార్యాచరణ పద్ధతి ఇస్లామీయ విధానంలో ఉంది. ఇటువంటి ప్రణాళిక, సరళమైన కార్యాచరణ పద్ధతుల్ని కాపాడుకొనేందుకు ఇస్లాం మంచి హితవుల్ని ఇస్తూంది. కాని ఇస్లామీయ సమాజం ఈనాడు పెను సవాళ్ళను ఎదుర్కొంటోంది. అందులో ఇస్లామీ కుటుంబంలో వివాహ సంబంధాలకు ఒక ప్రత్యేకత ఉంది. తరచు ప్రచార యంత్రాం

గాలు ఈ విషయాలలో జోక్యం చేసుకుంటున్నాయి. వైవాహిక సంబంధ బాంధవ్యాలను గురించి అపోహలు, అపార్థాలు, ప్రచారాలు వ్యాప్తిలో వస్తున్నాయి. పాశ్చాత్య వైవాహిక పద్ధతులలో ఉన్న రంగును ఇస్లామీ కుటుంబ పద్ధతులపై పూయడం జరుగుతుంది. ఇది ఇస్లామీ వ్యవస్థకు గొడ్డలిపెట్టు. దాని ప్రభావం ఇస్లామీ కుటుంబ వ్యవస్థపై పడింది. వధూవరుల ఎన్నిక ఎలా జరగాలి? పాటించాల్సిన పద్ధతి ఏమిటి? దైవం మనకిచ్చిన హితవులేమిటి? విశ్వకారుణ్య మూర్తి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)మనకిచ్చిన సమతుల ఆదేశాలేమిటి? వీటన్నిటిని తెలుసుకో వలసిన అవసరం ఎంతో ఉంది. ఈ విషయాలన్నింటిపై సంక్షిప్తంగా విశ్లేషించి వాస్తవికతను సాధారణ ప్రజలకు తెలియపరచాలనే లక్ష్యంతో ఈ పుస్తకం వ్రాయబడింది. ఈ చిరు ప్రయత్నం అల్లాహ్ మన్నన పొందాలని ఆకాంక్షిస్తూ....

శ్రేయోభిలాషి

న్యూఢిల్లీ
27-8-2006

**ముహమ్మద్ ఫహీమ్ అక్తర్ నద్వీ**

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# వివాహ సుదినం

జీవితంలో వివాహ దినం ఒక గొప్ప సన్నివేశం. ఆనాటి నుంచి ఒక నూతన జీవితం మొదలవుతుంది. ఆ మహా శుభ తరుణంలో ఒక కుటుంబం ఉనికిలోకి వస్తుంది. ఆ సంబంధంతో సగం విశ్వాసం పరిపక్వమవు తుంది. వధూవరుల కలయికతో ఒక నూతన బంధుత్వం ఏర్పడుతుంది. ఈ బంధు త్వాన్ని మించిన మరో బంధుత్వం అంత దగ్గరి సాన్నిహిత్యం కలిగి ఉండదు. వైవాహికంగా స్త్రీ పురుషుని కలయిక వల్ల శారీరక సంబంధం, మనోవాంఛల సంతృప్తి, ప్రేమకు చిహ్నంగా మారుతాయి.

ఈ కారణాల వల్ల వివాహ సుదినం ఒక ప్రత్యేకత సంతరించు కుంటుంది. అయితే పెళ్ళికి ముందు మరో సంఘటన ఉంది. అది అత్యంత ప్రాముఖ్యత కల విషయం. వివాహ సమయంలో కలిగే ప్రేరణ, ఉత్సాహం పెళ్ళికి ముందు జరిగే ఈ సంఘటనపైనే ఆధారపడుతుందని చెప్పాల్సి ఉంది. అది వైవాహిక జీవితంలో అడుగుపెట్టనున్న వధూవరుల ఎంపిక. జీవితంలో భాగస్వామ్యం పంచుకుంటున్న ఇరువురిని ఎంపిక చేయడం మొదటి ఘట్టం. ఈ నిర్ణయంపైనే వివాహ శిఖరం నిర్మించబడు తూంది. ఈ మొదటి ఘట్టపు పునాదులు దృఢంగా ఉంటే వివాహమనే భవంతి చిరకాలం మనగలదు. ఈ బంధపు పునాదులు నిలకడలేని వయితే రానున్న పరిస్థితుల గాలివానలో వివాహ భవనం కూలిపోతుంది. ఇంకా ఏదైనా దురవస్థ, గడ్డు పరిస్థితులు నామ రూపాలు లేకుండా పోతుంది. అందుచేత వివాహం జరిగే ముందు వధూవరుల ఎంపిక, వివాహ నిశ్చయదినం ముఖ్యమయినది. పెళ్ళి చేసుకోబోయే వధూ వరులు బాగా ఆలోచించి తెలివితేటలతో ఒక నిర్ణయం తీసుకోవలసి ఉంటుంది.

# వధూవరుల ఎంపిక జీవితాంతం వరకు ఉంటుంది

జీవిత భాగస్వాములుగ ఉండాల్సిన వారి ఎంపిక యావత్తు జీవితం కోసం ఉంది. అందుచేతనే వారిరువురికి జీవిత భాగస్వామి అని, జీవిక తోడు, నీడ అని అంటాం. జీవితంలో చేసే ఏ పనినైనా తీసుకోండి, పని మొదలు పెట్టే ముందు ఆలోచించి ఎంపిక చేసుకోవటం జరుగుతుంది. అన్నపానీయాల విషయంలో తినుబండారాల ఎంపిక చేసుకొంటాం. వస్త్రాలంకరణలో కోరికలకు అనుగుణంగా దుస్తులను ఏర్పాటు చేసుకుంటాం. కూడు, బట్ట తరువాత మనిషికి కావలసింది గూడు. దీని విషయంలో ఎంత జాగ్రత్త తీసుకొంటామో ఆలోచించండి. ఇంటి నిర్మాణం కోసం స్థల సేకరణ జరుగుతుంది. కట్టేందుకు ప్లాను తయారు చేసి నిర్మాణంలో పేరుమోసిన వారిని నియిమంచి, కావలసిన మెటీరియల్‌తో గృహ నిర్మాణం చేసి గృహప్రవేశం జరుగుతుంది. ఈ విషయాలన్నింటిని పరిశీలిస్తే కొన్ని ఒక పూటకు పనికొచ్చేవి. కొన్ని కొద్ది సమయం కోసం వినియోగపడేవి. మరికొన్ని కొన్నేళ్ళ వరకు ఉపయోగించుకోబడేవి మాత్రమే. అయినప్పటికీ ప్రతి విషయం లోనూ శ్రద్ధాసక్తులు చూపిస్తూ వాటి నిర్ధారణ చేయడం జరుగుతుంది. ప్రతి వస్తువు విషయలో విచారించి జాగ్రత్తగా వాటిని ఎన్నుకొని వాడుకొంటాం. ఈ నిర్ధారణలో మరువరానిది ఒకటుంది. అదేమంటే ఇవన్నీ ఎంతవరకు లాభదాయకంగా ఉంటాయి, ఎంతవరకు మనకు ఉపయోగపడతాయి అని తప్పక ఆలోచిస్తాం. తాత్కాలికమైన వస్తువులను గురించే ఇంతగా ఆలోచించి జాగ్రత్త పడితే మరి జీవిత భాగస్వామిని ఎంపిక చేసే సమయంలో ఎంత జాగ్రత్తపడాలి, ఎంత దూరదృష్టితో విషయాన్ని పరిశీలించాలి, ఎంత మనోమథనం చేసి

నిర్ణయం తీసుకోవాలో ఆలోచించండి. తాత్కాలిక ప్రయోజనాలు కాదు ఇక్కడ లెక్కించవలసింది, జీవిత భాగస్వామిని ఎన్నుకునే ముఖ్యమైన నిర్ణయం ఇది, అత్యంత కీలకమైన అంశం ఇది. జీవితమనే ప్రయాణంలో తోడునీడగా ఉండాల్సిన వ్యక్తి, సుఖదుఃఖాలలో పాలుపంచుకోవలసిన మనిషి, ఉదయం నుండి సాయంత్రం వరకు, 24 గంటల సమయం ఒక్కొక్క నిమిషం కంటికి రెప్పలా కాచుకొని ఉండాల్సిన ఈ ఇరువురిని ఎలా ఎంపిక చేయాలనే విషయం అన్నిటికన్నా ముఖ్యం. మనుషులు ఇద్దరు, వేరువేరు శరీరాలు, కాని మనసు, ప్రాణం ఒక్కటే అన్నట్లు జీవితం గడపాలి. వారి ఎన్నిక ఎలా జరగాలో ప్రతి ఒక్కరూ ఆలోచించవలసి ఉంది.

అసలు మాట ఏమిటంటే వివాహ బంధం చిరకాల అనుబంధం, ఎప్పటికి ఉండే సంబంధం. ఈ సంబంధం వధూవరుల మధ్య జరిగే ఒప్పందం. నిజమే, ఈ ఒప్పందం జీవితాంతం వరకు ఉండేందుకు చేసుకోవటం జరుగుతుంది. ఇస్లాం అపేక్షించేది అదే. వివాహం అనే ఈ బంధం దృఢంగా, పటిష్ఠంగా ఉండాలని కోరుతుంది ఇస్లాం. మానవాళికి హితవుల కోసం పంపబడినది దివ్యఖుర్‌ఆన్ వివాహ విషయంలో ఇచ్చిన ఆదేశం.

**వ అఖజ్‌న మిన్‌కుమ్ మీసాఖ్ గత్తిజా.** *(అన్ నిసా: 21)*

మీ మధ్య ఒక పటిష్టమైన ఒప్పందం చేయబడింది.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇచ్చిన ఆదేశాలలో ఇలాంటి ఎన్నో హితవులు వున్నాయి. వాటి సారాంశం చెప్పాలంటే నికాహ్ (వివాహం) చిరకాలం మనగలగాలి. వివాహం ప్రేమను విరజిమ్మాలి. ఈ బంధం జీవితాంతం ఉండాలంటే, వివాహం కోసం చేసే వధూవరుల ఎంపిక కూడా జీవితాంతం వరకు ఉపయోగపడేలా ఉండాలి.

# వధూవరులను ఎంపికలో ప్రమాణాలు

ఇక వివాహం చేసుకోబోనున్న జంటను ఎలా ఎన్నుకోవాలి అన్నదే సమస్య. ఈ జంట వీడని బంధం, జీవితం ముగిసేంతవరకు ఉంటుంది. కనుక వారిని ఎన్నిక చేసే సమయంలో ఏ విషయాలను ముందుంచు కోవలసి ఉంటుంది? ఆ విషయాల ప్రమాణాలేమిటి? ఆ ప్రమాణాలు జీవితమంతా తోడ్పడాలంటే వాటిని ఎలా అమలు చేయాలి అన్నది చర్చనీయాంశం.

సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని పరిసరాలలో వున్న పరిస్థితుల్ని పరిశీ లించి చూచినట్లయితే వివాహ సంబంధం ఎంపిక చేసే సమయంలో కొన్ని విషయాలను పరిగణనలో తీసుకోవలసి ఉంటుంది. మొదటి స్థానంలో నసబ్ (పుట్టిన కుటుంబం) వారి వర్గాన్ని పరిశీలించడం. సాధారణంగా ఒకే వర్గం వారు తమ సోదర వర్గంలోనే వివాహ సంబంధం కోసం వెంపరలాడు తుంటారు. వారి సోదర వర్గం నుండి వచ్చే సంబంధానికి ప్రాముఖ్యత ఇస్తుంటారు. కాని ఇస్లామీ ఉద్యమ జాగరూకత కల వర్గం వారు, ఈ సోదర వర్గం నుండి బయటికి వచ్చి వైవాహిక నిర్ణయాలు చేసుకొనే దృష్టాం తాలు మనకగుపడుతాయి. రెండవ విషయం ఆర్థిక స్థోమతను చూడడం. ఇది ఈనాటి దృక్పథం. మంచి ఉద్యోగం, మెరుగైన ఆర్థిక పరిస్థితిని వివాహ సంబంధానికి అనువైన విషయంగా ఎంచుకొంటారు. మూడవ స్థానంలో రంగు, రూపు, ఆకారం ఆకర్షణకల శరీరానికి ప్రాధాన్యం ఇవ్వడం. నాల్గవ స్థానంలో విద్య, నాగరికత, సమాజంలో కల హోదా, హుందాతనం చూస్తూ వైవాహిక సంబంధాలను ఎన్నుకొంటారు. ఈ నాలుగు పద్ధతుల్లో కూడా సిరిసంపదలకు ఐశ్వర్య స్థాయికి ప్రాధాన్యం ఉంది. పరిశీలించి చూస్తే వివాహ సంబంధాలు ఎన్నుకోవడానికి వీటికి కొంత ప్రాధాన్యత ఉందని చెప్పడంలో సందేహం లేదు. కాని ఈ విషయాల వల్లనే సంబం

ధాలు పటిష్టపడవు. పైకి కనబడే ఈ విషయాలు సంబంధాల నిర్ణయాల కోసం వినియోగించుకోవడం చాలా కాలం నుండి కొనసాగుతుంది. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) వివాహ సంబంధాలు వెదకడంలో ఏ ఏ విషయా లను దృష్టిలో పెట్టుకొని ప్రయత్నం చేయాలో తెలుపుతూ అసలైన పద్ధతి మన కోసం తెలియజేశారు. ఈ పద్ధతి జీవితాంతం వరకు పటిష్టంగా పని చేస్తుంది. వధూవరుల ఎన్నిక వాస్తవంగా మన్నికగల ఎన్నికగా చిరకాలం పని చేస్తుంది. మహాప్రవక్త ఆదేశం ఇలా ఉంది:

వధువుతో వివాహం నాలుగు విషయాలను పురస్కరించుకొని చేయడం జరుగుతుంది. అవి వధువు ఐశ్వర్యం, ఆమె కుటుంబ గౌరవం, ఆమె అందచందాలు, రూపురేఖలు ఆమె ధార్మికత. మీరు ధార్మిక ప్రవర్తన కల వధువును ఎన్నుకోండి, ధార్మికతను ప్రమాణంగా పాటించండి.

మహాప్రవక్త (సఅసం) ప్రవచనం ద్వారా మనకు తెలిసిందేమంటే ప్రజలు నికాహ్ (వివాహం) చేసుకొనే సమయంలో ఐశ్వర్యాన్ని, వంశాన్ని, పుట్టుకను, సౌందర్యాన్ని ధర్మాచరణను చూడడం జరుగుతుందన్నారు. ధార్మికతను ప్రమాణంగా చేసుకోవడం మంచిదన్నారు. అదే విజయవంత మైన ఆధారం అని తెలియజేశారు. ఇక ధార్మికత అంటే ఏమిటి? ఈ ధార్మికతను పాటించమని సర్వమానవాళికి ఆదర్శమూర్తి (సఅసం) లోక కళ్యాణానికి దోహదపడే కారుణ్యమూర్తి (సఅసం) ఆదేశించడమయింది. ఈ ప్రమాణం ఏదో ఒక విద్యాలయం నుండి పొందబడే సర్టిఫికేటు కాదు, ఒక వంశం నుండి దొరికే గుణం కూడా కాదు. వంశపారంపర్య గుణ గణాలు ధార్మికతను పసిగట్టేందుకు ఉపయోగపడవచ్చు. వాస్తవంగా మనం కోరే వధూవరుల ఎంపికకు దోహదపడవచ్చు. కాని తప్పనిసరిగా అది మన లక్ష్యం సాధించడానికి ఉపయోగపడుతుందని చెప్పలేము. మహాప్రవక్త (సఅసం) ఏ ధార్మికతను పాటించమని ఆదేశించారో అందులో మనస్సు, ఆలోచన, ప్రవర్తనలతో కూడిన గుణగణాలున్నాయి.

# ధార్మికత ఎన్నికకు ప్రమాణంగా ఉండాలి

ఇక రండి! మానవ మహోపకారి, కారుణ్యమూర్తి (సఅసం) ఇచ్చిన ధార్మికత ఆధారంగా ఉన్న గుణగణాలను ఆయనే (స) విశ్లేషించి చెప్పిన మాటల్లో తెలిసికొందాం.

ఆయన (సఅసం) ప్రవచనం ఇలా ఉంది.

*(ముస్లిం హదీసు నెం.2668)*

ప్రపంచం సిరిసంపదల స్థలం. ప్రపంచంలో అన్ని సిరిసంపదలలో ఉత్కృష్టమయినది సుగుణవంతురాలైన మహిళ. ఈ సుగుణం, మంచితనం ఏమిటి? హజ్రత్ అమామ(రజి)కు మహాప్రవక్త ఇలా ఉపదేశించారని ఉల్లేఖించ బడింది. *(ఇబ్నెమాజ హదీసు 1847)*

ఒక విశ్వాసి అల్లాహ్ పట్ల భయం కలిగి ఉండడం తరువాత ఒక పుణ్యవతి సుగుణవంతురాలైన మహిళను సతీమణిగా కలిగి ఉండడం కన్నా మించిన లాభం లేదు. ఏదైనా ఆజ్ఞ ఇస్తే దానిని పాటించడం, ఆమె వైపు చూసినట్లయితే సంతోషాన్ని కలిగించడం, ఒట్టుపెట్టుకొంటే దాన్ని నిర్వహించడం మరియు పెనిమిటి ఎక్కడకయినా వెళ్ళినట్లయితే తనపై మరియు పెనిమిటి సొమ్ముపై శ్రేయస్కర మనస్తత్వం కలిగి ఉండడం ఆ గుణవంతురాలి లక్షణం కావాలి.

ధార్మికతకు ఇచ్చిన పై వివరణ స్త్రీ ప్రవర్తన (క్యారెక్టర్) ఆమె గుణాలకు సంబంధించిన విషయాలను తెలియపరుస్తూంది. ఇక పురుషుని ధార్మికత విషయంలో ఉండవలసిన గుణగణాలను మహాప్రవక్త (సఅసం) ఆదేశించడమయింది. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు:

*(తిర్మిజి హదీసు 10820)*

అందరికంటే పరిపక్వ విశ్వాసం కల విశ్వాసి ఎవరంటే మంచి నైతిక ప్రవర్తన కలవాడు. పురుషులలో మంచివాడు స్త్రీల పట్ల సత్ప్రవర్తనకలవాడే.

ఒకప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా చెప్పారు: చాలా మంది మహిళలు ముహమ్మద్ (సఅసం) ఇంటికి వచ్చి వారి భర్తల ఆరోపణలు చేశారు. వినండి అలాంటి భర్తలు మంచి వారు కారు.

*(అబూ దావూద్ హదీసు నెం.1834)*

మరో హదీసులో ఒక భార్య హక్కులను వివరిస్తూ మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

మీరు తినే పదార్థాలను ఆమెకు పెట్టండి, మీరు మంచి దుస్తులు తొడిగితే ఆమెకూ తొడిగించండి, ఆమె ముఖాన కొట్టకండి, ఆమెను నిందించ కండి, కోప్పడి ఇంటి నుండి వెలివేయకండి.

నైతికతను నిర్వచించే పై గుణగణాలు మనిషి ఆలోచన ప్రవర్తనలకు సంబంధించినవి.

వివాహ సంబంధాల విషయంలో పై ధార్మిక విషయాలను ప్రామాణిక విషయాలుగా తీసికోవాలని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. ఈ గుణగణాలే నికాహ్ (వివాహ) సంబంధం ఎన్నుకోవడానికి పటిష్ట పునాదులుగా పనిచేస్తాయి. అందుచేత మంచి సంబంధం ఎన్నుకొనే విషయంలో వేరే గుణగణాలను, బాగోగులను లెక్కించే సమయంలో ధార్మిక గుణగణాలకు ప్రాధాన్యత ఇవ్వాలి. ధార్మిక బాగోగులను ప్రక్కన పెట్టి ఇతర మంచి చెడులను పరిశీలించే మనస్తత్వంలో పడకూడదు. ప్రథమంగా ధార్మికత విషయంలో సంతృప్తి పొంది ఆ పిమ్మట ఇతర విషయాల జోలికిపోండి.

## వివాహ సంబంధానికి ముందు ఏం చెయ్యాలి?

మన సమాజంలో కొన్ని అలవాట్లున్నాయి. వివాహ సంబంధాలు వెదికే సమయంలో ఇంటి పెద్దలు ఒకరికొకరు గురించి పరిచితులవుతారు.

ఆ తరువాత వధువు మరియు వరుని చూసే సంప్రదాయాన్ని పూర్తి చేసుకుంటారు. ఆ పిమ్మట కుటుంబీకులలో బంధువులలో మిత్రులలో వివాహ సంబంధం కోసం చేస్తున్న ప్రయత్నాలను ప్రచారంలోకి తెస్తారు. ఇరువర్గాలలో సంతృప్తి కలిగిన తరువాత వివాహ సంబంధం నిశ్చయం చేస్తారు. అంతేకాని ముందే వధువు వరుని నేరుగా చూడడం, పెళ్ళి చూపుల పేరిట వరుడు వధువుని చూడడం ఉండదు. వివాహ మయ్యేం తవరకు ఒకరినొకరు చూచుకొనేవారు కారు. ఇది సంప్రదాయాల పద్ధతి. కాబోయే పెనిమిటిని వివాహానికి ముందు పెళ్ళికూతురు చూడకుండా ఉండేది. వివాహ సంబంధ విషయాన్ని పూర్తిగా కుటుంబ పెద్దలు చూచు కొనే వారు. తల్లిదండ్రులు ఎన్నిక చేసిన వివాహ సంబంధం ఇటు వరునకు అటు వధువుకు తుది నిర్ణయమయ్యేది. పిల్లలు కూడా తల్లిదండ్రులు చేసిన వివాహ నిర్ణయం జీవితాంతం వరకు పాటించేవారు. సర్దుబాటు చేసుకొని జీవించేవారు. ఈ పద్ధతి ప్రకారం చేసిన వధూవరుల ఎంపిక ఆలోచనాపరంగా, ఆచరణాపరంగా ఇరువురు ఒప్పుకొని జీవితాంతం తమ బాధ్యతలను నెరవేర్చు కొనేవారు. కాని ఆధునిక యుగంలో ఫోటోగ్రఫీ ఉంది. రకరకాలుగా ఫోజులిచ్చి ఫోటోలు తీయటం జరుగుతుంది. పెళ్ళి సంప్రదింపులకు ముందే ఫోటోలు పంపుకొనే సాంప్రదాయం ప్రారంభ మయింది. వరుని వారు వధువు ఫోటోలను తెప్పించుకుంటారు. నచ్చినట్లయితే వధువు ఇంటికి ఒక పద్ధతి ప్రకారం వెళ్ళి సంబంధాన్ని నిర్ధారిస్తారు. పంపబడే ఫోటో ధార్మిక పరిమితిలో ఉండి, హిజాబ్ (పరదా) పద్ధతిని అనుసరించి ఒక సక్రమ నియమావళి ననుసరించి ఉంటే, వరుని వారు అలాంటి ఫోటోను తెప్పించుకొని చూచినట్లయితే అందులో ఏమీ అభ్యంతరం లేదు. పెద్దపెద్ద నగరాలలో ఇప్పుడు ఫోటోతో పాటు పరసనల్ వివరాలు (బయోడేటా) కూడా తెప్పించుకొనే పద్ధతి ఉంది. ఇందులో కూడా తప్పేమీ లేదు.

ఇంతవరకు సామాజిక సంప్రదాయాన్ని వివరంగా చర్చించాము. ఈ సంప్రదాయ పద్ధతులు మానవ అనుభవాన్ని బట్టి ఉనికిలోనికి వచ్చాయి. వీటివల్ల లాభాలు చేకూరుతాయి. కాని కొన్ని సమయాలలో ముఖ్యంగా అనవసరమైన రాద్ధాంతాలు ఉన్న చోట విభేదాలు వచ్చిపడతాయి, మంచికి బదులుగా చెడు చోటు చేసుకొని నష్టాలు కలుగుతాయి. కాబట్టి ఈ పద్ధతి అంటే ఫోటోలు పంపుకొనే విధానంలో షరీఅత్ (ధార్మిక నియమాలు)కు భంగం కలుగజేయకుండా, సక్రమ నియమావాళిని ఉల్లంఘించనంతవరకు అందులో ఆక్షేపించబడే విషయం ఏమీ లేదు. షరీఅత్ వివాహ సంబంధాన్ని ఆనందమయం నిరంతరం ఉండే వీడని బంధంగా చేయదలచింది. ఆ సంబంధానికి ముందు పాటించాల్సిన నియమాలు ఏమిటో వాటిని గురించి తెలుసుకొందాం.

ఇస్లాం నైతిక స్వభావం కలది. నైతిక సిద్ధాంతాలను నెరవేర్చడానికి ఏ బాధ్యతల్ని మోపుతుందో, ఏ పద్ధతుల్ని అమలు చేయమంటుందో అవన్నీ స్వాభావికమైనవి, ఆచరణాత్మకమైనవి. అనవసరంగా కష్టపెట్టడం షరీఅత్ వాంఛించదు. స్వాభావిక విధానాలను తుడిచిపారేయడం కూడా షరీఅత్ కోరదు. సమతుల్యమైన మధ్యస్థ విధానం అమలు చేయకోరుతుంది. సమాజంలో వివాహ ఎంపిక పేరిట విశృంఖలత్వాన్ని పెంచే మార్గం చూపదు. ఎవరి శీలానికి, గౌరవానికి కూడా వినాశం చేయ తలపెట్టదు. అలాంటి విపరీత పరిణామాలకు దారి తీసే ప్రతి మార్గాన్ని షరీఅత్ మూసేస్తుంది. దుష్పరిణామాలు కలుగకుండా అడ్డుగోడ నిర్మిస్తుంది షరీఅత్. అలా షరీఅత్ ఒకవేళ చేయనట్లయితే క్షణభంగురమైన వైవాహిక ప్రయోజనం వల్ల నిరంతర వ్యధ ఆగని దుఃఖం పైన పడుతుంది. వివాహ సంబంధం పటిష్టంగా నిరంతరం ఉపయోగపడుతూ, ఆనందం సమకూర్చిపెట్టడానికి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) సర్వమాన వాళికి

విజ్ఞత నేర్పిన ఆదర్శమూర్తి (సఅసం) రెండు ప్రాథమిక విషయాలను సూచించారు. ఈ సూచనలు పాటించడం వల్ల వివాహ సంబంధం నిర్ణయించు కొనే ముందు ఇరువర్గాలు సంతృప్తిపొందే అవకాశం ఉంది. ఈ సంతృప్తి సంబంధంలో దృఢత్వం, నిరంతరం ఉండే బంధం సమ కూర్చుతుంది.

## వధువును చూచుకోవాలి

మొదటి విషయం వరునికి సంబంధించింది. ఏ వధువును వివాహ మాడబోతున్నాడో ఆమెను వరుడు చూడవచ్చు. ఎందుచేతనంటే ఆమెతో కలసి అతడు జీవితం గడిపేందుకు విధేయతా భావంతో ముందుకు వచ్చాడు. మహాప్రవక్త (సఅసం) హజ్రత్ మొగైరా (రజి)కు సలహా ఇస్తూ ఇలా అన్నారు. ఆమెతో వివాహమాడడానికి సందేశం పంపావు. నీవు వెళ్ళి ఆ వధువును చూచుకో. ఎందుచేతనంటే ఆమెను చూడడం వల్ల నీ హృదయంలో సంతృప్తి భావన కలుగులుంది. మీరిద్దరు సంతృప్తితో ఆనంద దాంపత్య జీవితం గడుపుకోగలరు. ఇంకా మహాప్రవక్త ఇలా సెలవిచ్చారు. *(తిర్మిజి హదీసు 1007)*

"వెళ్లి పెళ్ళి కూతురుని చూచి రండి."

మీ ఇద్దరి మధ్య ఎడతెగని బాంధవ్యం కలుగడానికి ఇది సమం సజమైన ఉత్తమ విధానం.

మహాప్రవక్త (సఅసం) ప్రవచనంలో ఇలా చెప్పబడింది.

మీరు ఏ వధువుతో వివాహమాడదలిచారో అంగీకారం కల్పించే విషయాలను ఆమె యందు ఉన్నాయో లేదో చూచుకోండి.

*(అబూదావూద్)*

ఈ ఆదేశంలో విస్తృతంగా ఆలోచించుకొనే అవకాశం కల్పించబడింది. వధువు ఆకారం చూడనే చూస్తారు. వెనువెంటనే ఆమె విషయంలో వివరంగా వివరణ సేకరణ చేసుకోవచ్చు. తద్వారా వివాహ సంబంధం సంతృప్తికరంగా నిర్ణయించుకోవచ్చు. ధార్మికత కూడా అర్థం చేసుకోవచ్చు. మనసారా వివాహ సంబంధం నిశ్చయించుకోవచ్చు. కొన్ని సమయాలలో ఏదో చిన్న విషయం, ఆకారంలో కానివ్వండి, అనుమానా స్పద విషయాలు కానీయండి వివాహ నిశ్చయానికి ముందు తెలియ నట్లయితే వివాహానంతరం తెలిసినట్లయితే ఆ గుప్త విషయం నచ్చని విషయమై వివాహ సంబంధంలో చిక్కుముడిగా ఏర్పడుతుంది. వారి ఎడబాటుకు దారితీస్తుంది. ఇదే విషయం వివాహానికి ముందు తెలిసి ఉన్నట్లయితే మనసులో ఒక సంతృప్తి ఉంటుంది. ఇలాంటి కలగుబోయే అపాయకర పరిస్థితులు, అయిష్టత దూరం చేసుకొనేందుకు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) మనకు హితువులు ఇచ్చారు. ఆయన (సఅసం) ఒక హదీసులో ఒక అనుచరునికి ఇలా అన్నారు. "నీవు అన్సార్ తెగ వారి అమ్మాయితో వివాహమాడబోతున్నావు. ఒక విషయం బాగా అర్థం చేసుకో. వారి కళ్ళు ఎలా ఉంటాయో చూడు. వివాహ సంబంధానికి ముందు ఈ విషయంలో సంతృప్తి చేసుకో.

ఒక హదీసులో ఇలా ఉంది:

ఒక వ్యక్తి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) దగ్గరకు వచ్చి ఇలా అన్నాడు. నేను ఒక అన్సారి అమ్మాయితో వివాహమాడాను. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు. నీవు చూచావా? అన్సారి బాలికల కన్నుల్లో ఒక విషయం (లోపం) ఉంటుంది.

# వధువు ఇష్టపడని వివాహం చెల్లదు

ఇక రెండవ విషయం అమ్మాయితో సంబంధం కలది. వివాహ సంబంధం నిశ్చయించడంలో అమ్మాయి అభిప్రాయానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. అమ్మాయి వివాహానంతరం తల్లిదండ్రుల నుండి దూరమవుతుంది. పుట్టినిల్లుతోపాటు నివసించిన వీధి, పొరిగిండ్ల వాతావరణం, బాల్యపు తీపి జ్ఞాపకాలు, గతకాల అనుభూతి అంత వదలి మెట్టినింటిలో అడుగుపెట్టుతుంది. ఎటు చూసిన క్రొత్త క్రొత్త వాతావరణం, తెలియని పరిచయాలు. ఒక నూతన వ్యక్తితో కలిసి క్షణక్షణం జీవితం గడపాలి. అంతవరకు ఆ వ్యక్తితో పరిచయం లేదు. ఆ అమ్మాయి కూడా రాబోయే వరుని పట్ల మెట్టినింటి పట్ల తన ఆలోచనలలో ఒకింత సంతృప్తి కలిగి ఉండాలి కదా!

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ఆదేశించారు.

(తిర్మిజి హదీసు నెం.1026)

వివాహమాడే మహిళ తన సంరక్షకుని (వలి) కన్నా అధిక హక్కు కలది. (మొదటి వివాహబంధం తెగిన/ముగిసిన తరువాత) తన వివాహాన్ని స్వయంగా నిర్ణయించుకోవచ్చు. మొదటి వివాహం చేసుకొనే అమ్మాయి అనుమతిని కోరితే ఆమె మౌనం అనుమతిగా స్వీకరించబడుతుంది..

మహాప్రవక్త (సఅసం) ప్రవచనం ప్రకారం వివాహ సంబంధం నిశ్చయించేముందు అమ్మాయి అనుమతి తీసుకోవడం తప్పనిసరి. ఆమెతో సంప్రదించి సలహా తీసుకోవాలి. సలహా తీసుకొనేముందు పూర్తి వివరాలు ఆమెకు తెలియపరచాలి. ఆమె అభిప్రాయమే నిశ్చయానికి చివరి సంకేతం. మహాప్రవక్త (సఅసం) ఇచ్చిన ఈ ఆదేశం కేవలం నైతిక విలువలు కలదే కాదు, షరీఅత్‌పరమైన ఆజ్ఞగా తలంచబడుతుంది.

అమ్మాయి సంబంధానికి ఇష్టపడకపోతే చర్చించబడే సంబంధాన్ని నిరాకరిస్తే చట్టప్రకారం ఆ వివాహం చెల్లదు.

అమ్మాయి ఇష్టంపై ఆధారపడి నిశ్చయమైన వివాహం వల్ల శాశ్వత సంబంధం ఏర్పడుతుంది, శాశ్వత సంబంధమే నికాహ్ (వివాహ) ధ్యేయం. అమ్మాయి ఇష్టం లేకుండా బలవంతంగా వివాహం ఆమెపై రుద్దినట్ల యితే ఆ వివాహం భయంకర వివాదాస్పద పరిణామాలకు దారితీస్తుంది. ఇలాంటి ప్రమాదకర పరిస్థితులు ఉద్భవించేందుకు షరీఅత్ (ధార్మిక చట్టం) వీలుకల్పిస్తుందా? లేదు. ముమ్మాటికి లేదు. అందుచేతనే వివాహ నిశ్చయానికి ముందు అమ్మాయి ఇష్టాన్ని తెలుసుకొని వివాహ ఏర్పాట్లు చేయాలి. అప్పుడే ఎదుర్కొనబోయే కష్టనష్టాలను, సుఖదుఃఖాలను భరించే ఔదార్యం ఆమెకు ఉంటుంది.

మహాప్రవక్త (సఅసం) ఇచ్చిన ఈ రెండు ఆదేశాలు నికాహ్ (వివాహ) బంధాన్ని స్థిరపరచటానికి ప్రముఖంగా పనిచేస్తాయి. ఈ రెండు ఆజ్ఞలను పాటించి నికాహ్‌బంధం నిశ్చయించాలి. అప్పుడే కాబోయే ఆలుమగల మధ్య సంతృప్తి, సంతోషకర వాతావరణం, శాశ్వత అనుబంధం ఉంటుంది.

## వివాహ ఎన్నికను భంగపరిచే విషయం

ఇంతవరకు ఇస్లామీ దృక్పథంలో వివాహ నిశ్చయానికి గల సూత్రాలు, సిద్ధాంతాలు ఆదేశాలను గురించి చర్చించాము. ఇదే మన్నిక కల విధానం అని నిర్ణయించుకున్నాం.

ఇక రండి! ప్రస్తుతం మనం వధూవరుల ఎన్నికలో మన్నిక కల విధానం ఎంతవరకు పాటిస్తున్నామో చూద్దాం. సామాజిక వ్యవస్థలో వేగంగా వచ్చే మార్పుల వల్ల జీవితం ప్రభావితమయ్యే సమయంలో వధూవరుల

ఎన్నిక ఎంత సలక్షణంగా ఉందో, ఎంత అపాయకరంగా ఉందో, ఎంత వరకు ఇస్లామీ శిక్షణా సంస్కృతికి అనువుగా ఉందో పరిశీలిద్దాం.

ప్రస్తుతం వివాహ సంబంధాన్ని నిశ్చయించే సమయంలో రెండు మూడు చోట్ల తప్పులు జరుగుతున్నాయి. ఈ తప్పుల వల్ల తెలియని సంక్షోభం వైపు పయనిస్తున్నాం. ఈ తప్పులతో జరిగిన ఎన్నిక భయానక ఆందోళనలకు గురవుతూ సమాజాన్ని బాధలపాలు చేస్తుంది.

మొదటి విషయం విజ్ఞతతో కూడిన మహాప్రవక్త (సఅసం) ప్రబోధనలను ప్రక్కనపెట్టాం; పాశ్చాత్య దేశాల నుండి దిగుమతి చేసిన పద్ధతుల్ని ప్రామాణికం చేసుకున్నాం. ఇందులో సిరిసంపదలకు, స్థోమతకు ప్రాధాన్యం ఇచ్చాం. ఆధ్యాత్మిక, ధార్మిక గుణగణాలను వెనుక వేసేశాం. గుర్తుంచుకోండి. సిరిసంపదలు, మనిషి స్థోమత శాశ్వతం కావు. ఒకప్పుడుంటాయి, మరొకప్పుడు అదృశ్యమవుతాయి. అలాంటప్పుడు ధనం, స్థోమతకు ప్రాధాన్యమిచ్చి వివాహాన్ని నిశ్చయించకూడదు. సిరిసంపదల వల్ల ప్రేమాభిమానాలు జనించవు. వివాహం వల్ల కలిగే ప్రేమకు ప్రాధాన్యమివ్వకుండా సిరిసంపదలు, స్థితిస్థోమతల పట్ల మోజు, వ్యామోహాలకు ప్రాముఖ్యానిస్తున్నాము. అందుకే ఇలాంటి వివాహాలలో నిజమైన ప్రేమ పరిఢవిల్లదు. ప్రాపంచిక క్షణభంగుర సంపద, హోదాలను ప్రమాణం చేసుకొని తప్పుడు పద్ధతితో వివాహ నిశ్చయానికి వస్తున్నాం. ఒక కుటుంబ స్థోమతను మిన్నంటే విధంగా పొగడడానికి బూటకపు ప్రదర్శనల మద్దత్తు తీసుకోవడంజరుగుతుంది. మెరుగైన స్థోమత కలవారని నిరూపించుకొనేందుకు అప్పులు చేయడం జరుగుతుంది. ఆ కుటుంబాలు ఆర్థిక సుడిగాలుల్లో పడి నేలకూలుతాయి. వీటి ఆధారంగా ఏర్పరచుకొన్న వివాహ సంబంధాలు ఎలా వుంటాయంటే విచ్ఛిన్నమయ్యే మట్టి దిబ్బలపై పునాదులు వేసి నిర్మించిన హర్మ్యములవుతాయి. అవి తొందరగా

నేలకొరుగుతాయి. సమాజంలో ఇలాంటి అనేక సంఘటనలు తరచూ చూస్తూనే ఉంటాం.

రెండవ విషయం ఆడమగ తారతమ్యం లేకుండా కలసిపోయిన సమాజం. మిక్స్‌డ్ సొసైటీ సామాజిక రుగ్మతలకు నెలవైంది. ఈ రుగ్మతలు సమాజ నిర్మాణాన్ని దహనం చేస్తూ చెడుకు అండగా నిలుస్తున్నాయి. ఈ చెడు స్త్రీ పురుషుల విశృంఖలత్వాన్ని, లైంగిక వ్యవహారాన్ని మోడరన్ కల్చర్ పేరిట, ఆధునిక ప్రచార సాధనాల పేరిట, ఫ్యాషన్ పేరిట, ఎంటర్‌టైన్‌మెంటు పేరిట, వ్యాపార ప్రకటనల పేరిట సెక్స్‌ను దుర్వినియోగం చేస్తూ ఆసియా దేశాలలో చిచ్చుపెట్టింది. ముస్లిం సమాజాన్ని కూడా దుర్గంధపు గోతిలో నెట్టడానికి సకల ప్రయత్నాలు చేస్తుంది పాశ్చాత్య ప్రపంచం. ఈ లైంగిక చెడు వివాహ సంబంధాల ఎన్నికలో కూడా పని చేస్తుంది. విద్యాలయాల్లో ఆడ మగ వ్యత్యాసం లేకుండా తిరుగాడడం, ఎన్నో సన్నివేశాలుకల్పించుకొని యువతీ యువకులు లైంగిక ప్రేరణకు బలవుతున్నారు; తల్లిదండ్రులకు తరువాత నచ్చజెప్పి వివాహమాడుతున్నారు. కొన్ని సందర్భాలలో వారికి తెలియకుండా చాటున వివాహం చేసుకుంటున్నారు. ఇలాంటి రకరకాల వివాహాలు పెద్ద పెద్ద పట్టణాలలో సాధారణమవుతున్నాయి. వీటి వెనుక సుదీర్ఘ ఆలోచనలు కాని, సీరియస్ థాట్స్ గాని లేకపోవడం వల్ల ఆ వివాహాలకు పటిష్ఠమైన పునాదులుండవు. కొన్ని సమయాలలో లైంగిక ఉత్సుకతతో ప్రేరేపింపబడి వివాహం చేసుకోకుండానే దాంపత్య జీవితాన్ని ఆరంభిస్తారు. ఆ ఇరువురికి కుటుంబీకులతో పరిచయం కూడా ఉండదు. అంతేకాదు పరస్పరం అవగాహన ఉండదు. వారి మనస్తత్వం, బ్రతుకుతెరువు వేరువేరుగా ఉంటుంది. ఇలాంటి దంపతుల్ని పరిశీలించి చూస్తే కొన్ని సంవత్సరాలలో ఇంకా కొన్ని సందర్భాలలో కొన్ని మాసాలలోనే లైంగిక మోజు తీరిందంటే చీటికి మాటికి

తగవులాడడం మొదలెట్టుతారు. ఇలా మొదలైన కోట్లాటలు చివరకు తీవ్రరూపం దాలుస్తూ ఒకరినొకరు విద్వేషించుకుంటూ ప్రతీకార చర్యలకు పూనుకుంటారు. ఆలోచించి వధూవరుల ఎంపిక జరిగిన దాంపత్య జీవితంలో కలిగే మధుర ప్రేమకు, లవ్ మ్యారేజ్‌లలో మొదలైన విద్వేషానికి ఎక్కడ పోలిక! కేవలం జగడాలతో ఆగదు బ్రతుకు. వివాదాలు కోర్టుకెక్కుతాయి. వారి మధ్య వున్న విద్వేషం ఎక్స్‌ప్లాయిటేషన్‌కు బ్లాక్ మెయిల్‌కు దారి తీస్తుంది; చివరకు వారు వినాశానికి, హత్యాకాండకు పాల్పడుతారు. ఇలాంటి వ్యవహారాలు ఇప్పుడు సర్వసాధారణమయ్యాయి, అన్ని ప్రాంతాలలో వ్యాపించి వున్నాయి. ఏ ప్రాంతం కూడా ఈ విషమ పరిస్థితులకు అతీతంగా లేదు. ఇస్లాం ఇలాంటి భయానక పరిస్థితులు తలెత్తకుండా వివాహమనే పవిత్ర సంబంధాన్ని నిలకడకల మనస్సుతో, పరిశీలించి సుసౌష్టవమైన పునాదులపై నిర్మిస్తుంది. క్షణభంగుర ఉత్సకతను ప్రేరేపించే మార్గాలన్నింటిని ఇస్లాం మూసివేస్తుంది. నవయువకుల విలువైన పెట్టుబడితో, వారిప్రగతిశీలక పనులతో మానవాళి ముందడుగు వేయాలనే ఆకాంక్ష ఇస్లామీ పద్ధతుల్లో ఉంది.

వివాహ సంబంధం కోసం కేవలం లైంగిక ప్రేరణను మూలాధారం చేసే ఈ పని పాశ్చాత్య ఆలోచనల పర్యవసానం. ఇటువంటి ఆలోచనా విధానం ప్రాక్ దేశాల సామాజిక విధానం కాదు. ఇస్లామీయ సిద్ధాంతానుచరులలో పాశ్చాత్య పద్ధతుల జాడ మచ్చుకుకూడా లేదు, ఉండరాదు. ముస్లిం యువతీ యువకులు రానున్న జీవిత పరిణామాలను ముందుంచుకొని ఒక విశ్వాసికి ఉండవలసిన దూరదృష్టితో ఆలోచిస్తూ, ఇలాంటి పాశ్చాత్య లైంగిక షైతాను పనుల నుండి సంరక్షించుకొంటూ, నీచపు పనుల వల్ల వచ్చే ఎయిడ్స్ లాంటి భయానక అంటు రోగాల నుండి తమకు తాము రక్షించుకొనేందుకు సంపూర్ణ ప్రయత్నం చేయాలి. ఈ

సందర్భంలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇచ్చిన ఆదేశాలను, ఆజ్ఞలను ప్రతి సందర్భంలో ప్రాణానికంటే చేరువలో పెట్టుకో వలసిన అవసరం ఉంది. (తిర్మిజి)

"ఒక పురుషుడు తనకు తెలియని మహిళతో ఒంటరిగా కలువ రాదు. ఎందుచేతనంటే అక్కడ మూడవ వాడు షైతాను ఉంటాడు. యవ్వనంలోఉన్న యువకుడు, యువతి వ్యక్తిగతంగా కలువడం షరీఅత్ చట్టప్రకారం హరాం (నిషేధించబడింది) ఇలా కలువడానికి అనుమతి ఏ మాత్రం ఇవ్వబడ లేదు.

ఇంచుమించు ఇలాంటి సన్నివేశాలతో కలిగే చెడు కొన్ని వర్గాలలో మనకు అగుపడుతూంది. వివాహ సంబంధం కుదరకముందు యువ కుడు యువతితో వ్యక్తిగతంగా కలువడం జరుగుతుంది. మితిమీరి తిరుగడంలో ఈ కలయిక ప్రారంభమవుతుంది. ఆధునిక కాలంలో ఫోన్, మొబైల్‌ఫోన్ ఉండనే ఉన్నాయి. గంటల తరబడి మాటా ముచ్చట చేసుకోవడం జరుగుతుంది. వేళాకోళంగా నవ్వుల వాన కురిపించుకొంటూ పరిహాసం చేసుకొంటూ అన్ని హద్దులు దాటుతూ వెళతారు. కొన్ని సందర్భాలలో తల్లిదండ్రులు కూడా యవ్వనంలో ఉన్న యువతీయువ కులకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఇస్తుంటారు. ఇంకా చెప్పాలంటే ఏకాం తంగా కలిసే స్వేచ్ఛను కల్పిస్తూ వారిరువురికి వీపు తట్టి భలే పని చేస్తున్నా రన్నట్లు ప్రోత్సహించడం జరుగుతుంది.

ఒక విషయం గమనించదగింది. షరీఅత్ పరిధిలో ఉంటూ, నాగరికత విధానాలకు లోబడి సంభాషించుకోవడం, మరో వ్యక్తి సమక్షంలో షరీఅత్ విధించిన పరదా పాటిస్తూ మాట్లాడటంలో అభ్యంతరం లేదు. కాని ఒంటరిగా కలువడం, ఏకాంతంలో కాబోయే భర్తతో కలసి స్వేచ్ఛగా తిరుగడం, లైంగిక విషయాలను చర్చించుకోవడం, జంకులేకుండా సుదీ

ర్షంగా పరస్పరం మాట్లాడుకోవడం వంటి విషయాలు ఏ మాత్రం ఆమోద యోగ్యం కావు. మహాప్రవక్త (సఅసం) చెప్పిన పై హితవు శిరోధార్యం. విశృంఖలానికి వీలు కల్పిస్తే వివాహానికి ముందే పెళ్ళికాని దంపతులు పాశ్చత్య దేశాలు పెట్టిన పేర్లతో, పాశ్చాత్య పద్ధతులతో లైంగిక వ్యామోహా నికి బలై సంపర్గానుభూతి మనసారా పొందుతారు. ఇరువురు తిరుగులేని గోతిలో పడి లైంగిక వ్యవహారం సాగిస్తారు, కొన్ని సందర్భాలలో యువ తులు గర్భం దాలుస్తారు, అబార్షన్ కోసం డాక్టర్ల వెనుక తిరుగుతారు. ఈ దుస్థితికి చేరాక సమాజంలో వారికి చెడు పేరు వస్తుందని భయపడి వారిరువురు ఎడబాటు వైఖరిని అవలంబిస్తారు. లేదా లైంగిక మోజు తీర్చుకొని ఒకరు మరొకరితో బేజారు అవుతారు. ఇక తొలిఘట్టం తగవు లాటలు, మరో ముందడుగు వేస్తూ ఇరువురిలో ఎవరో ఒకరిని దాన్నుండి తొలిగించే ప్రయత్నం జరుగుతుంది. దౌర్జన్యం, బలప్రయోగం, హత్య అలజడులు సృష్టించబడతాయి. ఈ భయానక పరిస్థితులు రానివ్వకుండా ఇస్లాం ప్రారంభంలోనే అన్ని చెడుల ద్వారాలు బిగించి సంక్షోభ పరిస్థితుల్ని దూరం చేస్తుంది. ఇస్లామీ ఆదేశాలను, చట్టాలను పాటిస్తే మొహ్రిం కాని వ్యక్తితో యువతులు ఏకాంతంగా కలవకుండా చేసినట్లయితే మును ముందు లజ్జాహీనమైన ఈ పాపపు దౌష్ట్యాలు సమాజాన్ని కూల్చే దురవస్థలు వచ్చేవి కావు కదా!

మూడవ విషయం దాంపత్యసంబంధం జీవితాంతం వరకు ఉండేది. అందుచేత క్షణకాలిక ప్రయోజనాలను దృష్టిలోపెట్టుకొనే బదులు, దృఢమైన సంబంధం కోసం ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. పెద్దల సలహాలు, వారి ఆలోచనలను బాగుగా అర్థం చేసుకొని వాటిపై అమలు చేశామంటే మంచి ఫలితాలు సంక్రమిస్తాయి. రెండవ వైపు ధార్మిక సిద్ధాంతాల ఆధారంగా వారిరువురు సమాలోచనలు చేసి ఒక నిర్ణయానికి

వచ్చినట్లయితే వారిరువురి మధ్య మానసిక సమతుల్యం ఉంటుంది, సామాజిక పరిస్థితుల ఉల్లంఘన కూడా ఉండదు.

ఆలుమగలు కలిసిమెలసి ఉండడం అసలు లక్ష్యం. వారి మధ్య మంచి అవగాహన తప్పకుండా ఉండాలి. కొన్ని సమయాలలో వారి ఆలోచనలలో ఘర్షణ ఉంటుంది. సామాజిక వ్యవస్థలో పెద్ద మార్పులుంటాయి, కట్టుబాట్లు, పోకడలలో వేరు వేరు తీరుతెన్నులు ఉంటాయి. విద్యా విధానాలలో కూడా తారతమ్యాలు లెక్కించదగినంత ఉంటాయి. ఇవన్నీ దంపతుల మధ్య తగవులకు దారితీస్తాయి. వీటివల్ల అసలు దంపతుల మధ్య ఉండాల్సిన సంబంధం దెబ్బతింటుంది.

షరీఅత్ వివాహబంధం పటిష్టంగా ఉండాలని ఆకాంక్షిస్తుంది. ఇటువంటి బలవంతమైన సంబంధాలకు దారి తీసే చేసే ప్రతి విషయాన్ని దృష్టిలో పెట్టుకొని జాగ్రత్తపడాలంటుంది షరీఅత్.

షరీఅత్ చూపించిన మార్గాన్నే పాటించాల్సి ఉంది. దంపతుల్లో ఇస్లామీ వ్యవస్థ పట్ల విశాల దృక్పథం ఉండాలి. వారిద్దరు ఓర్పు సహనం కలవారై ఉండాలి. ప్రాపంచిక విషయాలలో వారిద్దరి మధ్య పొడచూపే వ్యత్యాసాలు సమాజంలో నలుగురి ఎదుట స్పష్టపడకూడదు. సమాజంలో కలిగే వ్యత్యాసం నికాహ్ గుణగణాలకు గొడ్డలిపెట్టుకాకూడదు. అలాంటి దంపతుల జీవితం ఆదర్శనీయం. ఇలాంటి ఆదర్శ దాంపత్య జీవితం గడుపజాలనట్లయితే, సమాజంలోని ఉన్నత నిమ్న భావాలు, వైవాహిక పవిత్ర సంబంధానికి భంగం కలిగించే విధంగా ఉంటే నికాహ్ లక్ష్యాన్ని కాపాడేందుకు అసమన్వయ దాంపత్య వివాహ సంబంధాన్ని వదులుకోవాలి. మొదటి నుండే వివాహ సంబంధం సమన్వయంగా ఉండేట్లు చూచుకోవాలి. సమన్వయ సంబంధం ఇస్లామీ షరీఅత్ ప్రకారం అవసరం. ఈ సమన్వయత్వం వివాహ లక్ష్యాన్ని బలపరుస్తుంది. మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఏమని ఆదేశించారో చూడండి.

ఓ అలీ! మూడు విషయాలలో ఆలస్యం చేయరాదు. నమాజు కోసం సమయం వచ్చాక, జనాజా (మృతదేహం) ఖననం కోసం వచ్చినప్పుడు, అమ్మాయి కోసం సమన్వయమైన వివాహ సంబంధం వచ్చినప్పుడు ఆలస్యం చేయరాదు.

ధార్మిక స్పృహ అధికంగా ఉంటే తగిన సంబంధం లేనప్పటికి నికాహ్ లక్ష్యం జవదాటే ప్రమాదం లేకపోతే అలాంటి సందర్భంలో పైపై అగుపడే అంశాలకుమరియు సమన్వయ సంబంధానికి పట్టుబట్టడం సమంజసం కాదు.

## మతానుయాయులతో కాకుండా బయటివారితో సంబంధం

వివాహ సంబంధాలలో సరికొత్త పోకడ కనబడుతోంది. ఈ పద్ధతి నిషేధించబడినదే కాదు, జీవితాంతం వరకు వ్యభిచారం చేసినట్లవుతుంది. ఒక సాధారణ ధార్మిక వ్యక్తి కూడా ఇలా అవుతుందని చెప్పడానికి వెనుకాడడు. అది ముస్లిమేతర మహిళ ముస్లింతో వివాహమాడటం లేదా ఒక ముస్లిమేతరుడు ముస్లిం మహిళతో నికాహ్ చేసుకోవడం. ఈ రెండు సందర్భాలలో వివాహమనేది సాధ్యం కాదని తెలుసుకోవాలి. ఇలాంటి వ్యవహారం నికాహ్ (వివాహం) అనే పవిత్ర పదంతో పొత్తులేనిది. ఇలా నికాహ్ పరిధిలో రాని వ్యవహారం నడుపుకోవడం వ్యభిచారంగా అభివర్ణించబడుతుంది. ఒక ముస్లిం పురుషుడు ముస్లిం మహిళనే వివాహమాడాలని షరీఅత్ చట్టం ఆదేశిస్తుంది. పూర్వగ్రంథాలపట్ల విశ్వాసంకల మహిళలు (యూదులు, క్రైస్తవులు) వారి మతాలననుసరిస్తూ కళంకంలేని నడవడిక కలిగిఉన్న వారిని ముస్లిం పురుషుడు వివాహం చేసుకోవచ్చు. అయినప్పటికి ప్రాధాన్యత ముస్లిం మహిళను వివాహం చేసుకొనేందుకే

ఇవ్వబడింది. దివ్యఖుర్‌ఆన్ ఈ విషయంలో నిర్ద్వంద్వంగా ఇచ్చిన ఆదేశమేమిటో చూడండి.

"మీరు బహుదైవారాధ మహిళలతో వివాహం, ఆమె మీకు ఎంత నచ్చినా, వారు విశ్వాసవంతులయ్యేంతవరకు చేసుకో రాదు. బహుదైవారాధన పాటించే మహిళ కంటే వివాహ మాడడానికి విశ్వాసం కల సేవకురాలు ఉత్తమురాలు. మరియు ముస్లిం మహిళల వివాహం బహుదైవారాధకులతో వారు విశ్వాసవంతు లయ్యేంతవరకు చెయ్యరాదు. బహుదైవా రాధన చేసే పురుషుని కంటే అతడు మీకు ఎంత నచ్చినా సరే విశ్వాసంకల సేవకుడే ఉత్తముడు. వీరు మీకు ప్రళ యాగ్ని వైపు ఆహ్వానిస్తున్నారు, మరి అల్లాహ్ ఇష్టపడి మిమ్మల్ని స్వర్గం వైపు క్షమాభిక్ష వైపు పిలుస్తున్నాడు.

*(బఖర - 221)*

ఇంకా ఇలా ఆదేశిస్తున్నాడు :

మీరు స్వతహాగా ముస్లిమేతర మహిళలను వివాహసంబం ధంలో ఆపి పెట్టుకోకండి. ." *(అల్‌ముమ్‌తహన : 10)*

మరో ఆదేశంలో దివ్యఖుర్‌ఆన్ ఇలా అంటుంది :

"రక్షిత మహిళలు మీ కోసం హలాల్ (స్వీకరింపదగిన వారు) - వారు పూర్వ ప్రవక్తల గ్రంథాలపై విశ్వాసం కలవారు కానీయండి. మీ కంటే ముందు ఎవరికయితే గ్రంథం ఇవ్వడం జరిగిందో ఆ తెగల వారు కానీయండి, షరతు ఏమంటే మీరు వారికి మెహర్ ధనాన్ని చెల్లించి వారికి సురక్షితులు కావాలి. అంతేకాని వారితో స్వేచ్ఛగా లైంగికాను

**భూతి పొందడంగాని, దొంగచాటున దాంపత్య స్నేహం చేయడంకాని ఉండరాదు."**

దైవగ్రంథంలోని పై వాక్యాలు ఒక విషయాన్ని తేటతెల్లంగా వివరించి చెప్పాయి. ఒక ముస్లిం మహిళ ఏ సందర్భంలోను ముస్లిమేతరుని భార్య కాజాలదు. ఆ ముస్లిమేతర వ్యక్తి ఏ మతాన్నయినా పాటించని పాటించకపోనీ దానితో ప్రమేయం లేదు. ఒక ముస్లిం పురుషుడు కేవలం ముస్లిం మహిళతోనే వివాహం చేసుకోవాలి. ఇక మినహాయింపు సందర్భాలలో నిష్కళంక హృద యులై అవివాహితులైన . అహ్లె కితాబ్ (పూర్వ దైవగ్రంథాలపై విశ్వాసంకల వారితో) వివాహం చేసుకోవచ్చు.

## ఇంటెర్నెట్‌పై వివాహసంబంధాన్ని వెదకడం

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం జీవితరంగాలన్నింటినీ ప్రభావితం చేసింది. వివాహ సంబంధాలను వెదికి తీయడంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ఉపయోగ పడుతుంది. ఇంటర్నెట్ తెరచి చూచామంటే చాలు, ఇంకేముంది యువతీ యువకులు తమ తమ వివాహ సంబంధ సందేశాన్ని రమణీయమైన ఆకర్షణతో సమర్పించడం కనబడుతూంది. ఇంటర్నెట్‌పై మెరుగులు దిద్దుకొన్న ఫోటోలు వేయబడుతున్నాయి. ప్రతి ఒక్కరు వారి వారి అభిరుచులను, ప్రాముఖ్యతలను, ప్రయారిటీస్‌ను, అందులో సూచించడం జరుగుతుంది. పసందైన వారితో ఇంటర్నెట్ మీదనే ముచ్చట్లు మొదలవుతాయి. నవయువతీ యువకులు తమకు నచ్చిన, నచ్చని వాటిని గురించి స్వేచ్ఛగా మాట్లాడుకోవడం జరుగుతుంది. ఈ సంభాషణ ఒక్కరితోకాదు కొన్ని సందర్భాలలో అనేక సంబంధాన్వేషితులతో జరుగుతుంది. ఎప్పుడయితే ఒకరినొకరు ఇష్టపడతారో అప్పుడు సంబంధ నిశ్చయ కార్యాచరణ ప్రారంభమవుతుంది.

ఇంటర్నెట్‌పై నిశ్చయమయ్యే వివాహాలలో ఎన్నో రకాల షరీఅత్ ఉల్లంఘనలు, పాపపు పనులు జరుగుతున్నాయి. ఇలాంటి వ్యవహారాలలో సామాజికంగా కూడా వివాహానికి కావలసిన దృఢపునాదులు కానరావడం లేదు. సాధారణంగా ఇలాంటి వివాహాలు నిరర్ధకములై ముగియడం చూస్తున్నాం. ఇంటర్నెట్ మరియు మీడియా కాన్ఫరెన్సింగ్ ద్వారా నిర్ణయమయ్యే వివాహ సంబంధాలలో మోసం, అపనమ్మకాలను నమ్మబలికించడం, తప్పుడు ప్రచారం, అబద్ధం, విస్తృతంగా వాడబడుచున్నాయి. ఇలాంటి వివాహ సంబంధాల వల్ల అనుదినం వినబడే వివరాలు విపరీత పరిణామాలకు దారితీస్తున్నాయి.

ధార్మిక స్పృహ కలవారు ఒకటి గుర్తుంచుకోవాలి. రూపసౌందర్యం కల వారి ఫొటోలను మంచి ఫోజులతో వేసి మొహ్‌రమ్ కాని (నిషిద్ధ) పురుషులకు ఇంటర్నెట్‌పై చూపించటం పాపపు పని.

ఇదేవిధంగా పరిచయంలేని యువతీయువకులు పరస్పరం అన్ని విషయాలపై లజ్జా బిడియం లేకుండా చర్చించుకోవడం, గంటల తరబడి నవ్వుకొంటూ హాస్యానందంతో లైంగిక విషయాలను గురించి మాట్లాడుకోవడం పరిపాటి కాదు, నిషేధించబడింది కూడా. ఈ ఇంటర్నెట్‌పై కలువడమనేది ఒక పరిచయం లేని మహిళతో ఏకాంతంలో ఒక వ్యక్తి కలవడమవుతుంది. ఇలాంటి ఏకాంత కలయిక చట్ట సమ్మతం కాదని, నిషేధించబడిందని ఇంతకు ముందే తెలియపరిచాం. బూటకపు పోకడల ఆధారంగా ఏర్పరచుకోబడే వివాహ సంబంధం, వాస్తవికతను గురించి తెలియగానే తొఱుపోతుంది. ఆ పిమ్మట సంబంధాలు నిలువక విద్వేష వాతావరణంలో వైవాహిక తెగతెంపుల కోసం పరుగిడడం చూస్తూనే ఉన్నాం.

ఇలాంటి అవాంఛనీయ సంఘటనలు చోటు చేసుకోకుండా షరీఅత్ పరిధిలో ఉంటూ నీతి నియమాలకు లోబడి ఎవరైనా వివాహ

సంబంధం కుదుర్చుకుని దాంపత్య జీవితం కోసం ఆధునిక టెక్నాలజీ పద్ధతుల్ని అవలంబించి లాభపడితే ఇస్లాం ఈ పద్ధతిపై ఆంక్షలు విధించదు.

## తల్లిదండ్రులు ఎన్నుకొనే వివాహ సంబంధానికి ప్రాధాన్యత ఇవ్వండి

ఇంతవరకు తెలియపరిచిన వాటివల్ల కొన్ని విషయాలు స్పష్టమవుతున్నాయి. నికాహ్ సంబంధం శాశ్వితమని, తద్వారా తృప్తి సంతోషాలు వెల్లివిరియాలని ఈ లక్ష్యసాధన కోసమే ఇస్లామీ షరీఅత్ సవ్యమైన ఆదేశాలు ఇచ్చినదని ఇందులో ఏ మాత్రం తప్పుపట్టడానికి అవకాశం లేదని తెలుసు కొన్నాం. షరీఅత్ ఇచ్చిన హితవుల సారాంశాన్ని వెలికితీసి, సుదీర్ఘ కాలపు మానవ అనుభవాన్ని ముందుంచినట్లయితే, సాధారణ పరిస్థితులలో కారుణ్యంకలవారు, సదా మన మేలుకోరే తల్లిదండ్రులు చేసే దాంపత్య ఎన్నికకు ప్రాధాన్యత ఇవ్వవలసి ఉంది. తల్లిదండ్రులు కూడా సంతానంతో సలహా కోరుతారు. విషయ వివరాలుసంతానానికి తెలియపరుస్తారు. వారి ఇష్టాయిష్టాలను తెలుపుమని కోరుతారు. పిల్లల ఇష్టాయిష్టాలను దృష్టిలో పెట్టుకొని వివాహ సంబంధం దృఢపరుస్తారు. ఇలాంటి నిశ్చయానికి ప్రాధాన్యత ఇవ్వాలి. తల్లిదండ్రుల ఎంపిక అల్లాహ్ తలిస్తే శ్రేష్టమవుతుంది. వారి ఆశీర్వాదం వల్ల ఆ మంచి సంబంధం వివాహానంతరం పరిఢవిల్లుతుంది. మహాప్రవక్త (సఅసం) చేసిన దుఆలో కూడా ఈ భావం ఉంది.

**"బారకల్లాహు లక వ బారక అలైక, వ జమియ బైనకుమాఫిల్ ఖైరి"**

మీకు, మీవారికి మీ మధ్య మంచి కోసం ఉన్న వారందరికి సమృద్ధి కలుగుగాక. (తిర్మిజి 1011)

తల్లిదండ్రులు సంతాన యోగక్షేమాలుకోరని వారు కారు. ఏదో తాత్కాలిక ప్రేరణతో సంతానం కోసం ఎన్నుకొనే వైవాహిక సంబంధం వారి జీవితంలో సుఖదాయకం కాకూడదని వాంఛించడం జరిగితే, వివాహ సంబంధం శాశ్వతంగా ఉండకూడదని కోరడం అయితే షరీఅత్ వివాహం చేసుకొనబోయే వారికి సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ప్రసాదిస్తుంది. ప్రేమాదరణలు లేని తల్లిదండ్రుల నిర్ణయాన్ని త్రోసివేయవచ్చుని తెలుపు తుంది. అచ్చం ఇలాంటి ఒక సంఘటనలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) తనకు ప్రశ్నించిన అమ్మాయితో నిర్మొహమాటంగా ఇలా అన్నారు, "మీ తండ్రి అనుసరించిన ఈ వైఖరి నీవు తప్పనిసరిగా పాటించనవసరం లేదు." *(బుఖారి హదీసు 4743)*

## మహాప్రవక్త (సఅసం) ఆదేశాలే మార్గదర్శకం

బాగా ఆలోచించండి. జీవితం అంటే ఏమిటి? ఎడతెరిపి లేకుండా సాధించబడే అనుభవం పేరే జీవితం. మానవుడు తనపై తానే దౌర్జన్యం చేసుకుంటాడు. మరియు విపరీతంగా తెలియనివాడు కూడా. అంతకు మించితే మనిషిలో ఏమీ లేదు. అందుచేతనే మనిషి సాధిస్తున్న అనుభ వాలను భద్రపరుస్తూ రాబోయే తరాల వారికి అందించి వారికి లాభం చేకూరుస్తున్నాం. ఇస్లాం ఇలాంటి అనుభవాలతో లాభపడాలని కోరు తుంది. మానవాళి జీవితం ప్రయోజనకరంగా, లాభదాయకంగా, మోక్ష దాయకంగా చేయడానికే షరీఅత్ ఉంది. సృష్టికర్త మానవుల అవసరా లను, వారి భవితవ్యాన్ని గుర్తించినవాడు. అందుచేత ఆయన మానవులపై కరుణించి, ఉత్తమోత్తమయిన జీవిత విధానాన్ని తెలియబరచినాడు. ఈ విధానం ఇహపరాల విజయానికి దోహదపడుతుంది. షరీఅత్ తెలిపిన మార్గం మానవుని నైతిక స్వభావంతో పొంతన కలది, మానవులకు దీని

అవసరం ఉంది కూడా. జీవిత పయనం సాగే కొద్ది షరీఅత్ చట్టాలలో ఉన్న రహస్యం బహిర్గతమవుతుంది. తెలివైన వ్యక్తి షరీయత్ సూచించే మార్గాన్ని పాటిస్తాడు. చేరువకావలసిన గమ్యస్థానం చేరుతాడు. మానవ మహోపకారి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) మనకోసం ఇచ్చిన హితోపదేశాలలో కొన్నింటిని పైన వివరించడమైంది.

జీవితంలో సంభవించే అనేక సమన్వయాల్లాగే వివాహ సంబంధాలను నిశ్చయించుకోవడంలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఆదేశాలను అనుసరించినట్లయితే మన కుటుంబాలు వసంత వాతావారణంతో శోభనిస్తాయి, మన వైవాహిక సంబంధాలు మెరుగుపడతాయి, వివాహం వల్ల కలిగే ఆనందానుభూతిని శాశ్వతంగా అనుభవిస్తాం.

## రండి! ఒక ప్రతిజ్ఞ చేద్దాం!

పాశ్చాత్య దేశాల నుండి దిగుమతి అయ్యే పద్ధతులను వారికి తిరిగి పంపివేద్దాం. వధూవరుల ఎంపికలో మన ఆదర్శమూర్తి ముహమ్మద్ (సఅసం) ఇచ్చిన ఆదేశాలనే పాటిద్దాం. దైవం మనకోసం ప్రేమాదరణలతో పంపిన హితవులకు కట్టుబడి ఉంటూ మన సమాజాన్ని సుగుణ సంపదలతో పునర్నించుకొందాం. సంక్షోభం వైపు పరుగిడుతున్న పాశ్చాత్య సమాజాలు మన ఆదర్శానికి ముగ్ధులై తమ రుగ్మతలకు స్వస్తి పలికి మహాప్రవక్త (సఅసం) చూపిన ఆదర్శాన్ని పాటించేటట్టు చేద్దాం.

- సమాప్తం -